# శ్రీ వేంకటేశ్వర శతకము



—గ్రంథకర్త—

హేజీబు వేంకటరావు

శ్రీ కన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాల,

విజయనగరము.

# ఆశీస్సు.

చిరంజీవి హాజీబు వేంకటరావను నితఁడు పదునెనిమి దేండ్ల యాంధ్ర బ్రాహ్మణ బాలుఁడు. మొన్ననే 'యింటర్మీడియేటు' పరీక్షను కృతార్థుఁడై నవాఁడు. తీరిక గల్గుసమయమున నితర కార్యములఁ గాలము వెచ్చింపక నాంధ్ర మహా ప్రబంధములఁ జదువుచు, నాంధ్ర మహా కవీశ్వరుల సుమహితకవితా చాతుర్యము నభినందించుచు దత్పద్ధతి నెల్లని యవలంబించి, భాషా సేవయొనర్చి, ధన్యతఁగాంచఁ దలంచువాఁడు.

పిలచినఁబలుకు మహిమముగల్గి కలియుగమునఁ బ్రత్యక్ష దైవమనుఁ విఖ్యాతిఁగన్న శ్రీతిరుపతి వేంకటేశ్వరుని కృపతోఁ బాటుగా, కవిసత్తములయు, పండితోత్తములయు, కళాతత్త్వవిత్తములయు నాశీస్సులనొందఁగోరి, యితఁడిపుడు తనప్రథమ కృతియగు వేంకటేశ్వర శతకమును జేయబూని, యాంధ్ర మహాశయుల దర్శన భాగ్యము నభిలషించుచున్నాఁడు. భగవదనుగ్రహమునఁ దాను మున్ముందు రచియింపఁబోవు మహా గ్రంథ సంపుటమునకీ చిన్నికృతి యిష్టదేవతా ప్రార్థన రూపమగు కృత్యాదిగా భావింపనగును. జగద్వాఙ్మయ సారస్య గ్రహణ పారీణులగు మహనీయుల కీకృతి సర్వసామాన్యముగాఁ బొడకట్టవచ్చును గాని దీని రచించు సందర్భమున బాలకవి సదభిప్రాయము సమ్మతింపఁదగినది.

నవకవితయవతరించిన, యీదినములలో విద్యార్థుల నేకులు సాహిత్య సంపాదనమునందును, గవితాభ్యాసమునందును, శ్రమపడఁజాలక, 'దేహాన్ని' 'గురువాన్ని', యను నాస్తికతకుఁ బాల్పడి, కళపేరను, కవిత్వము పేరను, చేతికివచ్చిన వ్రాతయును నోటికి వచ్చిన కూఁతయును విసరుచుండ నీ బాలకవి ప్రాచ్యాచారము ననుసరించి సాంప్రదాయ సిద్ధముగాఁ గృషి చేయుచుండుట ప్రశంసింపఁదగినవిషయము. ఈతని పరిశ్రమ యింకను వృద్ధినొంది ఫలవంతమై మహా గ్రంథరచనకుఁ గారణమగుఁగాకయని మనసార నాశీర్వదింతును.

విజయనగరము
8=3=33

విశ్వనాథకవిరాజు.

---

వేంకటేశ్వర శతకమునందలి కొన్ని పద్యములను నేను జూచినాను. గ్రంథకర్త లేఁ బ్రాయము వాఁడయ్యుఁ దత్కవిత్వము మాత్రము ప్రౌఢముగానున్నది. విద్యార్థి దశయందుండి యిట్టి యుత్కృష్టరచన చేయఁగలుగుట మిక్కిలి వింతగా నాకుఁదోచినది. ఇందలి పద్యములు పొల్లుమాటలు లేక జిగిబిగి గలిగి రసవంతములై యొప్పుచున్నవి. ఈగ్రంథకర్త చిరంజీవియై కీర్తికరమగు కావ్యపటిమతో నుల్లసిల్లుఁగాక!

విజయనగరము
8=3=33

భోగరాజు-నారాయణమూర్తి.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీ వేంకటేశ్వర శతకము.

ఉ. శ్రీమహిళామనో జలజభృంగ! పతంగతురంగ! రాక్షస
స్తోమవిభంగ! సాంద్రనవతోయదకృష్ణవిభాంగ! రంగ! సు
త్రామముఖాఖిలామరవితాననతాంగ! కృపాంతరంగ! గో
త్రావర సజ్జనావళిశుభాంగ! రమావర! వేంకటేశ్వరా.

ఉ. దాసజనావనోత్సుకత తానకమానసమందు నిత్యమా
వాసముసేయునంచుఁ గడుభక్తిని మామక భావమందునీ
దాసజనావళిన్ గలసి ధ్యానము సేసెద నీమహత్త్వముల్
దోసముఁబాయఁగాఁ సలుపు తోయజలోచన! వేంకటేశ్వరా

చ. శ్రితజనపారిజాత! సురసేవితభవ్యపదాంబుజాత! యో
గతతధృతిత్రాత! రావణనిపాటనశాలికిరీటజాత! సం
తతకరుణాప్రపూత! దురితప్రకరాంబుదవాత! ధాత! శ
త్రుగీతివిజేత! భక్తివినుతుల్ గడుఁ జేసెద వేంకటేశ్వరా.

ఉ. రాక్షసరాజగంధకరిరాడ్విపాటనపాటవైకహ
ర్యక్ష! విపక్షశిక్ష! సుకృతాంచితసన్మునిభక్తబృంద స
త్పక్ష! రసాభూత్రిదివదాసజనావనభవ్యదీక్ష! ప
ద్మాక్ష! గజేంద్రరక్ష! నను సన్మతిఁ బ్రోవుము వేంకటేశ్వరా

ఉ. ద్రౌపదిపై గజేంద్రుపయి ధ్రువుపయిన్ సురరాజసూనుపై
నాపురుహూతుపై దశముఖానుజుపైఁ దటినీతనూజుపైఁ
దాపసపత్నిపై హరివితానముపై ధరణీతనూజుపైఁ
జూపిన ప్రేమ నాపయిని జూపుము; తిర్పతి వేంకటేశ్వరా.

ఉ. వారిజపత్రనేత్ర! నవవారిదమేచకకమ్రగాత్ర! సం
సారవిముక్తిసూత్ర! ఘనసాగరజాతవధూకళత్ర! పా
కారిపవిత్రనామపాత్ర! దురితావళికాననవీతిహోత్ర! కా
మారివిరించిమిత్ర! కరుణాంబుధిఁ దేల్పుము వేంకటేశ్వరా.

ఉ. శ్రీసతినీవునక్షురతిసింధువుఁ దేలుచునుండ, దేవ! సం
త్రాసవిముక్తిఁ జేయుమను నాదము కర్ణములన్ బడంగ, నీ
ఠీ్మసతిన దెవిడిచని, సింధురరక్షణనక్రశిక్షణన్
జేసి, నిజాశ్రితావనవిశిష్టతఁ జూపవె వేంకటేశ్వరా.

ఉ. తావకభక్తసర్యులకుఁ దల్లివి తండ్రివి దాతవాప్తుఁడున్
నీవె సదాస్యపాలుఁడవు, నీవె శరీరముఁ బ్రాణమాత్మయున్
నీవె ధనంబు సంపదయు నీవె భవాబ్ధిఁ దరింప నీవె గా
శ్రీవర! కర్ణధారుఁడవు సేవకకోటికి; వేంకటేశ్వరా

చ. అగణితహాయనంబులు శిలాకృతినుండి, యహల్యతాను పె
న్వాగభరియించియుండ రవివంశపయోధిరామరాజపై
జగమున నుద్భవించి సతిశాపవిముక్తినిఁ బాదధూళిచే
జగదభిరామ! చేయవె విశాలకృపామతి వేంకటేశ్వరా.

ఉ. అక్కజమయ్యనీమహిమలాత్మఁ దలంచిన నెవ్వరేని ము
న్నక్కునసద్ధిఁగట్టుటయునోముటయున్ బగవానితిమ్మనిన్
జక్కగనొక్కకోఁతను నిశాచరుఁజంపుటచేసినారలే
నిక్కముగానమూహ్యుఁడవునీవు రమావర! వేంకటేశ్వరా.

చ. అవనిజనించి కౌశికునియాగముఁగాచి నిశాచరావళిన్
జవమునద్రుంచి రాపయిని శంకరుచాపమువంచివిమ్మటన్
అవనిజఁబెండ్లి గూడిప్రమదాంబుధిఁదేలి యయోధ్యకేఁగి కై
కవరమునన్వనంబులకుఁ గ్రక్కునఁ జేరవె వేంకటేశ్వరా.

చ. అహారహమున్ మునీశ్వరులుతాపసభూములకేఁగివారికిన్
బ్రహరిచరించి దీవనలవారికిఁ గాంచియొసంగ నొక్కనాఁ
డహితునిచేతఁ బంపబడినట్టి మృగంబును సీతకోరఁగా
రహినిజెలంగి పోఁగవె? కురంగముబట్టఁగ వేంకటేశ్వరా.

చ. హరిణముబట్టనీవుఁజన హా! యనుజాయను దీన నాదమా
లెఱవవినంగ, లక్ష్మణుని దెంపునఁబంపియొకర్తయుండగాఁ
గఱటివనీచకుండొకఁడు కాంతను భిక్షముగోరి యడ్డెక
న్నొరఁగిసతిన్ హరింపఁడే కో! బుద్ధివిహీనత వేంకటేశ్వరా

ఉ. కాంతను బర్ణశాలనునొకర్తునువీడి సుమిత్రిసూతిరా
న్స్వాంతమునందుఁ గుంది విపినంబులనెల్లఁ జరించినీవు శ్రీ
కాంతను గానలేక ప్లవఁగంబులమైత్రిగ్రహించి వాలి న
య్యంతకు పట్టణంబునకు నంపవె తిర్పతి వేంకటేశ్వరా.

చ. ప్లవఁగసమూహమున్ గొన వె! లంకకు నేఁగ వె! రాక్షసావళిన్
బవరమునందుఁ గూల్ప వె? నివాళి సురావళి చేతఁ బొంద వే?
యవనిజశీలమున్ బ్రకటమానటు సేయ వె యగ్నిహోత్రుచే?
యువతిని జెట్టవట్ట వె? యయోధ్యకు నేఁగ వె? వేంకటేశ్వరా.

ఉ. అంగదజాంబవద్దినకరాత్మజ మారుతిముఖ్యవానరల్
వెంగటనిల్చికొల్వఁగ వసిష్ఠభృగుప్రముఖుల్ మునీశ్వరుల్
పొంగి కరంబు, దీవనలఁ బల్కఁగ నీయఁగ నీవు నప్పుడు
త్తుంగమణీమయాసనముఁ దోరఁపు వేడుకతోడ నెక్కి సా
ధ్వ్యాంగనఁ జెట్టవట్టవె? కృపాకర! తిర్పతి వేంకటేశ్వరా.

చ. ఎవరిని గొల్తు నే నెవరి నెంచెద నెవ్వరిఁ బూజసేతు నే
నెవరిని బిల్చెదన్ దలఁతు నెవ్వరి నెప్పుడు మామకాత్మలో
నెవరిని రక్షకుండనుచు నెంచెద లేరు మఱెవ్వరున్ రమా
ధవ! గతి నీవె తక్క సతతంబును బ్రోవఁగ వేంకటేశ్వరా.

ఉ. ఎన్ని భవంబులెత్తితి నికెన్ని భవంబుల నెత్తువాఁడనో!
పన్నగవైరివాహ! నను భవ్యకృపామతిఁ జూచి జన్మమిం
కెన్నఁడు నెత్తకుండఁగఁ బరేశ! త్వదీయపురంబునన్ భవ
త్సన్నిధి నుంచుమయ్య; పరిచర్యలు సేసెద వేంకటేశ్వరా.

ఉ. నిన్నె మదిన్ స్మరించెదను, నీకె నుతుల్ గడఁ జేసెదన్ సదా
నిన్నె కరంబు నమ్మెదను; నీకయి నేను నిరీక్ష సేసెదన్
నిన్నె సతంబు నాథునిగ నేతగఁ దల్చెద మన్మనంబునన్
గ్రన్నన నన్ను సత్కృపను గావుము తిర్పతి వేంకటేశ్వరా.

చ. అగణిత దేవతాతతికి నారయ నీవెకదా! రమాసతీ
శ! గతి; తలంప నీవెకద సర్వచరాచరసృష్టికర్తవౌ
జగదభిరామ నీవెకద సంతతమన్నిఁట నిల్చియుందు; నీ
దగుమహిమంబు నెన్నవశమా! మముబోంట్లకు వేంకటేశ్వరా

చ. అతులితరత్నసంయుతములై వెలుఁగొందెడు కుండలద్వయిన్
తతజలజాతపత్రముల ధర్మమునన్ రచియించు నేత్రముల్
పతితమహాఘవహ్నినవవారిద, మేచకకమ్రగాత్రమున్
సతతము భక్తియుక్తి మదిసంస్తుతిఁ జేసెద వేంకటేశ్వరా.

ఉ. బీదలసాదులన్ నృపుల వెంగలులన్ మునులన్ గృహస్థులన్
సాదరదృష్టితో సతతమారయుచుందువు; నీకుఁ జూడఁగా
భేదము లేదొకించుకయు; విశ్వములోపల నెల్లవారికా
మోదము నీవు గూర్చెదవు; భూరికృపాకర! వేంకటేశ్వరా.

చ. హరి! భవదీయనామములనాత్మఁ దలంచుచు భక్తితోడ భూ
సురజనపూజనంబులను సొంపుఁదలిర్పఁగఁ జేయుచుండి స
త్పురుషులఁగూడి నీపదతోయజయుగ్మము బూజసేయు నా
నరులె మహాత్ములీభువి జనార్దన! తిర్పతివేంకటేశ్వరా.

ఉ. సప్తనగావరోహణము సల్పిఁ దలంచి నిన్నుఁ జేర సం
తృప్తియె కాని లేదు శ్రమ యించుకయైనను దేవ చిత్రమా!
లిప్తగఁ దోఁచు నామమున లీలగ దర్శనబు సం
ప్రాప్తముగన్ భవన్మహిమ మాఁగ దయింతయు వేంకటేశ్వరా

చ. జయజయ! శ్రీరమాహృదయ సారసనిత్యనివాసషట్పదా!
జయజయ! నారదాదిమునిసన్నుతపాదసరోరుహద్వయా!
జయజయ! సాధువత్సల! విశాలకృపాకర! పక్షిరాడ్ధ్వజా!
జయజయ! దుష్టశిక్షక! గజప్రిమదప్రద! వేంకటేశ్వరా.

చ. అగణితహాయనంబులుపయస్సులనిల్చితదేకదృష్టితోఁ
బగలునురేయినాక యనిహారితనిశ్చలయోగనిష్ఠులై
నెగడెడి తాపసోత్తములు నెట్టననందఁగరానిముక్తి నీ
దగుకృపకల్మిమున్ శబరియందదే? తిర్పతివేంకటేశ్వరా.

ఉ. శ్రీలనవారిగానొసఁగు శ్రీసతినీసతి; నిత్యమున్ గడున్
లీలజగంబుసృష్టియొనరించెడి ధాతసుతుండు నీకు; నీ
యాలయమాపయోనిధి; శశాంకుఁడు బావ; మఱేకొఱంత లే
దేలశ్రితావళిన్మనుప నింతవిలంబము? వేంకటేశ్వరా.

చ. మునులనురాజులన్ ఘనులఁ బుణ్యచరిత్రులనిర్జరావళిన్
మనుచు టదేమిగొప్పపసి? మాన్యచరిత్ర! రమాకళత్ర! న
న్నునుగడుబీదసాదలననూనకృపాంబుధిఁ దేల్చి పెంచఁ బె
త్తనమగునీకుదేవ! నిజదాసజనావన! వేంకటేశ్వరా.

చ. మనముననిన్ను నెంచెదను; మానకనీగురుమంత్రరాజమున్
దనివిమెసంగ బాడెదను; తావకరూపముగన్నులారఁ నేఁ
గని మదిమోదమున్నుమని కాయము హస్తమునస్థరించి ని
న్ననవరతంబుఁగొల్చెద; దయాంబుధిఁ దేల్చుము వేంకటేశ్వరా

చ. హరి! మధుసూదనా! యనుచు హాటకచేల! యటంచుఁ గేశవా!
వరద! ముకుంద! శౌరి! యని, భక్తజనావన! పద్మనాభ! శ్రీ
వర! యని, చక్రపాణి! యని, భావమునన్ భవదీయనామముల్
నిరతము నేఁ బఠించెదను; నీరజలోచన! వేంకటేశ్వరా.

చ. హరి! భవదీయశక్తికిఁ గనన్యబలంబు సమానమౌనె యం
చరసితి నస్మదీయహృదయంబున నీపదునాల్గులోకముల్
సరియగుశక్తి యెచ్చటను సామ్యముకై నను గానరాదు; నీ
యురుతరశక్తి నీకెఁ దగు నో కరుణాకర! వేంకటేశ్వరా.

ఉ. ప్రాణులసృష్టి చేయుదువు ప్రాణులలోన వసించియుందువా
ప్రాణులలీలఁ గాచెదవు; ప్రాణుల నే హరియింతు వంతటన్
బ్రాణులు గ్రమ్మరన్ ధరణిఁ బ్రాక్తనకర్మ జనించునట్లుగా
మానక సేవ చేతువు; రమాహృదయేశ్వర! వేంకటేశ్వరా.

చ. నలినముఖీ! రమాసతికి నారతమున్ దగు నిక్కమైన, భూ
తలమునఁ బుష్పరాసులకుఁ దానుకడున్ గడుఁ బెద్దయైనఁ బ్రా
క్షలిని సుధాకరోదయమునఁగా ముకుళింపదే; యజ్ఞాన సం
కలనము గల్గుపూరుషుఁడు కల్మిని పోయఁడె? వేంకటేశ్వరా

చ. ఫలము రవంత లేదు ఘనభాగ్యులకున్ గడు మేలు గూర్ప; స
త్ఫలమగు బీదసాదలకు దానము సేయ, నదెట్లనంగ భూ
వలయమునందు వారిదము పండిన చేలకుఁ గీడుఁ దెచ్చు; స
త్ఫలమిదు నెండియున్న వరిపైరునకున్ హరి! వేంకటేశ్వరా

# వేంకటేశ్వర శతకము.

చ. గురుతరశక్తిఁ గల్గు ఘనకుంజర మొక్కటి తొల్లి దప్పిచే
సరసునఁ జేరి తాన లఘుసత్త్వము తోఁ జరియింప నక్రమా
కరికరమున్ముఖాగ్రమున గట్టిగఁ బట్టగ మొఱ్ఱ వెట్టదే
ద్విరదము? స్థానశక్తి గణుతింపఁ దరంబా కో! వేంకటేశ్వరా.

ఉ. క్రౌంచములున్మరాళనికరంబును కేకోలనన్వసించుఁగ
కంచలమించు మేల్నడలయందము నొందునె? క్రౌంచజాలముల్
క్రించగువాఁడు సద్గుణగరిష్ఠునిఁ బోడ మెలంగుగాక; యొ
క్కించుకఁ దత్ప్రవర్తన వహించునె? తిర్పతి వేంకటేశ్వరా

ఉ. బల్లిదుఁడౌ వృకోదరుఁడు వైభవమేదియు డంగియుండియున్
బల్లెవసించు సజ్జనుల భక్షణ సేయుచు విక్రమించునా
క్షుల్లకునిన్వధింపఁడె? యశోధనుఁడౌ బలధైర్యశాలి తా
నుల్లమునన్ సహించునె? పరోద్ధతిఁ; దిర్పతి వేంకటేశ్వరా.

చ. ఒకరుఁడు విద్యచే ధనమునొందిన వేరొకరుండు గూఢ వి
ద్యకొఱకు యత్నమెంతయును దానొనరింపగవచ్చుఁగాని ల
క్ష్మికి కృప లేనిచో నతఁడు సేసెడి దేమి? పొలంబు దున్నుక
ర్షకుఁడు సువృష్టి లేనియెడ సల్పెడి దెయ్యది? వేంకటేశ్వరా.

ఉ. శ్రీమహిళా మనఃకుముదశీతలధామ! హృతోగ్రపాతక
స్తోమ! లసద్యశోవిజితసోమ! శ్రితావనకామ! యుగ్రసం
గ్రామసురారిభీమ! సురరాణ్మునిసంస్తుతభవ్యనామ! శ్రీ
ధామ! కృపాబ్ధిసీమ! ననుధన్యునిజేయుమ! వేంకటేశ్వరా.

ఉ. శ్రీమణిమనోహర!విశేషశుభాకర! యాశ్రితాళి మం
దార!జగద్విహార!కరుణాఘనసాగర! భాసమానకే
యూరమణీంద్రహార!సమరోరుధరాధర!శంబరారిశృం
గార! సురారిగర్వహర! కాంతివిభాకర! వేంకటేశ్వరా.

ఉ. శ్రీమహిళాస్యపుల్లసరసీరుహమిత్ర! విరించిశర్వసు
త్రామముఖాఖిలామరకదంబనతోరుచరిత్ర! యుగ్రసం
గ్రామవిపక్షజైత్ర! మునికాండమహీరుహవాహ్యచైత్ర! భూ
మీమరుదాది సజ్జనసుమిత్ర! రమేశ్వర! వేంకటేశ్వరా.

చ. వనితలు పుత్రమిత్రులును బాంధవులున్ గోవులు భూములున్ సతం
బని నరులెంచుచుందురకటా! నిజమారయ బుద్బుదాళి క
ననుకొనికొంబులిన్నియును; దండమునందున వీసడింపరు, ని
న్ననవరతంబుగొల్చునరుడందును ముక్తిని వేంకటేశ్వరా.

చ. హరియనఁగా హరుండనఁగ నబ్జజుఁడన్న మహాత్మ! నీవె; నీ
కరియఁగ సాటి వేల్పుగలఁడా? త్రిజగత్ప్రభుఁడీవకావె? నీ
కుఁ గవిశశాంకులిద్దఱునకుంఠిత తేజము నించు నేత్రముల్
నిరతము నిన్ను భక్తిఁ గని నే స్మరియించెద వేంకటేశ్వరా.

చ. కవచము మేనఁ దాల్చుకొనఁగా స్వశరీరమునన్ గ్రహించిన
యమ్ములున్
బవరమునన్ దగుల్కొనని భంగిని దాసకపాదపద్మముల్
బవలును రేయి ధ్యానింపఁగ శుభంబులురా వెఱచున్ గొఱంతలోం
దవు; తెలిసెన్ భవచ్చరణదాస్యమహత్త్వము వేంకటేశ్వరా.

చ. భవమనుసాగరంబుఁగడవన్ భవదీయసపర్యగాదె మా
నవులకునావ; నీవుకదనౌకనుజక్కఁగఁద్రిప్పఁగర్ణధా
రివి; భవదీయభక్తిని వరించెదనిత్యము; ముక్తినిచ్చి నీ
భవనముఁజేర్పవయ్యనను; భవ్యకృపామతి వేంకటేశ్వరా.

ఉ. శైలములెక్కి దూఁకఁగ, విషంబమితంబుగఁ గ్రోలఁగా, మహా
భీలశిఖిన్ బడంగ, నరబృందము బూనినఁబూనుగాక నీ
లీలలునీచరిత్రములలీకములంచుఁ దలంపవచ్చునే?
శ్రీలలనామనోహర! విశేషశుభాకర! వేంకటేశ్వరా.

ఉ. ప్రాచినసరోజబాంధవుఁడు ప్రాభవమొప్పరుచిప్రపూర్ణుఁడై
తోఁచఁగ సంతలోఁదిమిరదోషమువాయుదెసర్వవిస్ఫుటన్
నీచరణాంబుజస్మృతులు నెమ్మనమందుదయించియున్న న
శించను పాపపుంజములహీనశుభాకర! వేంకటేశ్వరా.

ఉ. తావకభవ్యనామరససత్త్వసుధాబ్ధిఁ దానమాడక కి
కేవలతీర్థముల్మునుఁగనేమి ప్రయోజనమయ్యె? లేశమున్
బోవునె పాపపుంజములు? పోవునెమానసమర్త్యయోగముల్?
కేవలముజ్ఞులౌమునినుగీర్తనసేయుదు వేంకటేశ్వరా.

ఉ. శ్రీవర! నిన్నుభావమునఁ జింతనసేయరు శైశవంబునన్
యౌవనమందు వార్ధకమునందును సజ్ఞతచే రతిక్రియా
భావముచే నశక్తిని నపారకృపాకర! వారినెట్టులన్
గావగనేర్తువో దురవగాహము తిర్పతి వేంకటేశ్వరా.

చ. శరనిధియొక్కసారణిగ శైలమదొక్కదృషత్తుగాఁగఁగే
సరియొకలేడిగా నలకృశానుఁడు శీతకరుండుగాఁగ నా
ద్విరసనపాళిభూషలుగ భీష్మవిషంబు సుధారసంబుగా
నరుఁడుగణించునిన్ననుదినంబు భజించిన వేంకటేశ్వరా.

చ. అనిమిషవైరియొక్కఁడజునంతటివాని మొఱంగి వేదముల్
గొనిచన సర్వదేవతలు కోరికలీరికలెత్త నీవు నాఁ
డనిమిషరూపమూని విపులాబ్ధినిజొచ్చిన సోమకాఖ్యు నొ
క్కనిమిషకాలమందునఁ బెకల్చవె? తిర్పతి వేంకటేశ్వరా.

చ. అలకలశాబ్ధిభాండముగ నాయహిరాజురురజ్జువట్లు సం
ధిలునటు సేసి రాక్షసులు దేవతలున్ ఘనమందరమ్ము నా
వెలయుగిరిన్ మథింపఁ బెను వ్రేఁగునకుఁ దాల్పవె కర్పరాగ్రమం
దలయక నీవు దివ్యకమఠాకృతిఁ దాలిచి వేంకటేశ్వరా.

చ. ధరణి హిరణ్యనేత్రుఁడను దానవుఁడొక్కఁడు చాఁపచుట్టగా
శరనిధిలోనడంచిన నిశాచరుద్రుంచి వరాహమూర్తివై
ధరణిని నీవు దొంటివలె దక్షిణశృంగమునందు దాల్చవే
తరమె? నుతింప నీమహిమ, దాసజనావన! వేంకటేశ్వరా.

ఉ. శ్రీనరసింహమూర్తి! సురశేఖరశర్వముఖాఖిలామర
శ్రేణిసశంక నా దనుజశేఖరువక్షము వజ్రనిష్ఠురా
త్యానతవిస్ఫురన్నఖశితాగ్రములన్విదళించి వెంటఁద
త్సూనునిఁ బ్రోచినాఁడవు; యశోధర! శ్రీధర! వేంకటేశ్వరా.

చ. ఒకచరణమ్ముభూమిపయి నొక్కపదమ్మువియత్తలంబునం
దొకటి బలీంద్రుశీర్షముననుంచి జగత్త్రితయంబునా బలా
రికినొసఁగన్ దలంచుచు ధరిత్రినిశాచరరాజుపజ్జనీ
వొకకుహనావటుండవయియుండవె? తిర్పతి వేంకటేశ్వరా.

చ. ఇఱువదియొక్కసార్లు నృపబృందమునెల్లఁ బ్రతిజ్ఞఁదీర్ప భీ
కరతరరోషభావమునఁ గాలునిపీటికిఁబంపి రక్తని
ర్ఝరములఁ దర్పణమ్ము పితృరాజికిఁజేసి ధరామరాళి నా
దరమునఁజూచినాఁడవుకదా! పరమేశ్వర! వేంకటేశ్వరా.

చ. హలముఖశస్త్రజాలములుహస్తమునందుధరించిముష్టికా
ద్యలఘునిశాచరావళి హృదంతరభేదనజేసి సర్వసా
ధులను ప్రమోదవారినిధిఁదోగఁగఁజేసితివీవసుంధరా
స్థలిబలరామమూర్తి ని ముదంబునఁదాలిచి వేంకటేశ్వరా.

చ. అనిమిషులెల్లవేఁడఁ ద్రిపురాసురులన్ వధియింపబుద్ధమూ
ర్తినిధరియించి యాత్రిపురదివ్యసతీమణులన్మొఱఁగి శృ
గిణివయికూపమెల్లఁ గలగించి సుధారసమెల్లగ్రోలి భ
ర్గునకుశరంబవై దనుజకోటినిద్రుంపవె? వేంకటేశ్వరా.

ఉ. బల్లిదులైరిపాపులుప్రపంచమునన్ భవదీయభక్తులో
మెల్లిదమైరి; దుష్టజనబృందములన్ శితహేతిచేత సం
ధిల్లగ నీవు ఘోటకముదేరుగఁబూన్చివధింపఁబూనితీ
వెల్లజనుల్ నుతింపఁ గలికీశ్వర! తిర్పతి వేంకటేశ్వరా.

ఉ. శ్రీసుదతీనివాస! బుధచిత్తవిలాస! విలాసకౌముదీ
భాసురసౌమ్యహాస! రిపువారమదేభమృగేశ! సర్వభూ
మీసురకర్మరక్షణసమీడితదివ్యసుధీవికాస! యా
జ్ఞాసనముఖ్యదైవతనతాంఘ్రిసరోరుహ! వేంకటేశ్వరా!

ఉ. నీరజనాభ! మేమురిజనీతరుణీమణిచేతులం దని
స్సారులమై చరుండ వ్యథసల్పుమనే క్రిమికీటకంబులన్
జేరగనీకమమ్ములను శేషకృపన్ బరికింతువీవు; స
త్కారుణికోత్తమా! కటునుదారుడవౌ హరి! వేంకటేశ్వరా.

చ. ఆహారహామున్ ధరాతలమునందు జనుల్ విగతాసులౌటని
మ్మహిజనులెల్లరున్ దెలిసివారలు స్వార్థపరత్వమున్ భవన్
మహీమండలంపరిపాలనగుణత్రిత్రయంబును వీడరాత్మని
గ్రహమును బూనరిందులకుఁగారణమెయ్యది? వేంకటేశ్వరా

చ. సకలచరాచరావళిని సంతతముం దెదవంతరాత్మవై
ప్రకటితతావకీనపదవారిజసేవను భక్తితోడఁ బా
యక, రమెనరించువారిహృదయంబులఁగ్రాలియటక్కొకర్కండే
ర్పకనిటు దవ్వొనర్చుటకు రంబభిమానము? వేంకటేశ్వరా.

చ. ప్రమదముమీరవారిదమరందరుచుల్ గొనియామిచాలక
భ్రమరములాతటాకమదనంబుల కెన్నఁ బనినాసజేయునే?
విమలభవత్కథామృతము వీనులకెక్కఁ బసన్యగాథలం
దమకున వీనుదోయి? కరుణాకర! శ్రీకర! వేంకటేశ్వరా

ఉ. చేరు నెపక్వశస్యముల శేషముగా భుజియించు చిల్క తు
త్తూరసులన్ ?మదేభములఁ ద్రుంచి, ప్రమోదమున భుజించు కా
కీరవమేఁగునే శునక నీచకళేబరమున్ స్పృశింప? ని
న్గోరెడి సజ్జనుండు పెరకోర్కులఁ గోరునె? వేంకటేశ్వరా.

ఉ. పాతకవార్ధియింకగను బాడబవహ్నియు, నపరిమేయదుః
ఖాతతవహ్ని నార్పఁగ ఘనామృతవృష్టి; భవాంధకార ప్ర
ద్యోతము; క్రోధవృత్తి తతిఁ ద్రుంచ కఠోర కుఠారధార; శో
భాతతమై దనర్చు తమ యంఘ్రిసపర్యయె వేంకటేశ్వరా.

ఉ. తోయరుహాక్ష! నాయెడల దోషములుండిన సైఁపఁ గోరి, య
త్యాయతభక్తియుక్తుఁడయి నాత్మఁ దలంతును నిన్ను నిర్జ
ధ్యేయ! విధేయుఁడన్ భవదధీనకృపామృతవృష్టి తక్క, పా
థేయము లేదు జీవితపు తెన్ను గమింపగ వేంకటేశ్వరా.

ఉ. తాపకభక్తిచేత సతతంబును నీదగు కీర్తనంబు స
ద్భావముతోడఁ జేయుచు ముదంబు యశంబు ఘనంబు నొందఁగా
శ్రీవర! వాసుదేవ! సరసీరుహలోచన! సాధువత్సలా!
దేవ! యటంచు నిన్ను వినుతింపగఁ గోరెద వేంకటేశ్వరా

ఉ. శ్రీరమణీవిలాస! నిను జేరి భజింపనియట్టివారి సం
సారము లంధుమ్రోలఁ దగు చంద్రికలున్ బధిరావళిపజ్జ వీ
ణారవముల్ నపుంసకుని కాతత మోహవిలాసినీజనం
బారయ భస్మమందిడెడు హవ్యము నౌఁగద వేంకటేశ్వరా,

ఉ. దానముసేయనేర; గృహదారసుతాదులవీడనేర; నే
స్నానజపాగ్నిహోత్రములుసల్పఁగనేర; నిరంతరంబునీ
మానితపాదపద్మములు మానసవీథిఁజరింపనిచ్చి, నిన్
ధ్యానమొనర్పనెంతు; నిజదాసజనావన! వేంకటేశ్వరా.

చ. ప్రమదముపొంది బంభరము భవ్యసుగంధమరందపానమం
దుమదినినిల్పి, యెల్లపుడుఁదోయజపాళిజరించునట్లు నీ
విమలపదాంబుజద్వయిని వేడుకమీరఁగఁగోరునాదు హృ
ద్భ్రమరము దివ్యభక్తిరసభాసురతన్ గొను; వేంకటేశ్వరా.

చ. ప్రవిమలతావకీనపదపద్మము[illegible]టచేఁబవిత్రమై
భువివిలసిల్లునాతులసిపోల్కినిదావకభవ్యసత్కథా
శ్రవణముచేతపస్వులను శశ్వదుదంచితయుష్మదీయపా
దవనజసంగతిన్ మనసుధన్యతనొందవె? వేంకటేశ్వరా.

ఉ. సంతతమున్ ద్వదీయపదసారసయుగ్మసపర్యఁగోరు సు
స్వాంతుఁడు సత్వరంబులగుభాగ్యములెంచునె? కల్పవృక్షమే
చెంతవసింపనర్థి పెరఁజేరునెయొందునఁగాని? నిన్ను సే
వింతుఁదలంతుఁగోరెదపవిత్రతనొందఁగ వేంకటేశ్వరా.

ఉ. తావకభక్తవర్యుల సతంబునురక్షణసేతువంచునే
భావనజేసినీచరణపంకజయుగ్మము సంతతమ్ము మ
ద్భావమునందునిల్పికను భక్తినిగొల్చుచునుంటినిన్ను; ల
క్ష్మీవర! ముక్తినాకొసఁగి సేమముగూర్పవె, వేంకటేశ్వరా.

చ. **మురహార!** నీపయిన్ శతకముల్ శతముల్ పదివేలులక్షలున్
సరతము జెప్పి రెందఱో మనీషులు; చెప్పుచునుండిరింక నెం
దఱో విరాజులీధరముదంబున వారలె కాని నేను నీ
చరితము వాకొనన్ దగనె? సాధుజనావన! వేంకటేశ్వరా.

చ. కరులను గోరలేను; కనకంబు నొసంగుమటంచుఁ బల్కలే
దురుతరభాగ్యమొందుటకు నుత్సుకతన్ వహియింపలేదికే
సిరులను గోరలేదు; సురసేవిత! త్వచ్చరణాంబుజద్వయిన్
నిరతము గొల్వవేఁడెదను నిర్మలభక్తిని; వేంకటేశ్వరా.

ఉ. తెప్పవు దుఃఖవారినిధిఁ దేలుచు మున్గుచునున్న మమ్ము నీ
వొప్పగ నొడ్డుఁ జేర్చుటకు నుల్లమునన్ సతతంబు నిన్ను మా
యప్పవటంచు నెంచవలదా? భవదీయపదార్చనారతిన్
దప్పు ఋణంబు దీరుటకు దారిమఱున్నదె? వేంకటేశ్వరా.

చ. పరధనతస్కరుండు; పరభామలఁ బొందఁగఁ గోరు పాపి; భూ
సురజనహంత; నిష్ఠురతసూనృతముఁ వెలిసేయువాఁడు; పు
ణ్యరహితుఁడాదిగాఁ గలదురాత్ములుగూడఁ ద్వదీయపూజలన్
జరిపి సముక్తి నొందెదరు సాధుజనాదర! వేంకటేశ్వరా.

చ. మఱిమఱి నీకు మ్రొక్కెద రమావర! యన్యములొల్లఁ గాని త్వ
చ్చరణసరోజయుగ్మవిలసజ్జలబిందుల నొప్పవ మన్మన
స్సరసి నొకింతయేని గలుషంబులు సంటగనీక సజ్జన
స్ఫురదురుకీర్తి హంసముల పొందొనఁ గూర్పవె వేంకటేశ్వరా

చ. అమితసుఖప్రదంబు, దురితావళి సంహరణంబు, పాతక
ద్రుమదమనంబు, ముక్తిముకురంబు, శ్రితాళిసమీహితప్రదం
బు, మదహారంబు, భూరితరపుణ్యకరంబు, మనోహరంబు, త్వ
ద్విమలపదార్చనాఫలము భృత్యులకెల్లను వేంకటేశ్వరా.

ఉ. స్నానజపాగ్నిహోత్రముల సల్పుటకంటెను, భక్తితోడ నె
వ్వాని హృదంతరంబున భవత్పదనవ్య సరోరుహద్వయీ
ధ్యానము దెప్పు సేయఁబడు; హస్తతలామలకంబు ముక్తి యె
వ్వానికి, కీర్తి శాశ్వతము వానికిఁ దిర్పతి వేంకటేశ్వరా.

ఉ. శ్రీమహిళాంతరంగ సరసీజ సదాశ్రిత చంచరీకముల్;
క్షేమహిమాన్వితమ్ములు; సుధీజన సేవితముల్; సదారిపు
స్తోమభయంకరమ్ములు; యశోజితహీరపటీరమల్లికా
దామములయ్య! త్వద్గుణవితానములో ప్రభు! వేంకటేశ్వరా.

ఉ. శ్రీకరముల్ సతీపతిశచీపతి వాక్పతి ముఖ్యనిర్జరా
నీకవశీకరమ్ములు; వినిర్మలముల్ రిపుజాలవాతద
ర్వీకరముల్ రమాహృదయభృంగసమాశ్రిత పారిజాతముల్
నీకమనీయపాదములు; నీరజలోచన! వేంకటేశ్వరా.

ఉ. శ్రీదములార్యమండల విశేషవినోదములాశ్రితాళిస
మ్మోదము లిందిరాహృదయ పుష్కరసూర్యమయూఖ
మాలికల్
సాదరముల్ త్వదీయకరుణార్ద్రవిలోకనముల్ సదామదా
హ్లాదవిధాయకంబులు; దయాకర! శ్రీకర! వేంకటేశ్వరా.

ఉ. శ్రీరమణీమణీహృదయసీమవిహారి! యఘాపహారి! నీ
హారపటీరహీరధవళాబ్జనిభాయతకీర్తిధారి! సం
సారవిముక్తికారి! హరి! శౌరి! మురారి! సురారిహారి! కం
సారి! శ్రితానుసారి! కరుణాంబుధిఁ దేల్పుము వేంకటేశ్వరా

ఉ. వారిధిరాడ్గభీర! రిపువర్గపయోదసమీర! పుణ్య వి
స్తార! సురాద్రిధీర! విబుధప్రకరాత్మవనీవిహార! పా
కారి పురారివారిజభవాఖిలనిర్జరజాలసంతతా
ధార! కృపాప్రపూర! ఘనధామవిభాకర! వేంకటేశ్వరా.

ఉ. పండితమండలీహృదయ బంభరసేవితపుండరీక! యు
ద్దండరిపుప్రభంజన విదారణదారుణదండశూక! యా
ఖండలముఖ్యనిర్జరనికాయహృదంబుజ చంచరీక! భూ
మండలరక్షణైక! తరమా నినుఁ దెల్పఁగ? వేంకటేశ్వరా.

ఉ. శ్రీలలనావిలోల! సువిశేషతపోధనపాల! భవ్యస
శీల! గళప్రదీప్తతులసీవనమాల! యఘౌఘమేఘవా
తూల! సువర్ణచేల! నవతోయదనీల! విధేయదేవతా
జాలసదానుకూల! రిపుజాలభయంకర! వేంకటేశ్వరా.

ఉ. పంకజసంభవేశమఘవప్రముఖామరహృచ్చకోరశ
శాంక! తిమింగిలాహినికరాంబుచరాన్వితభూరివార్ధిప
ర్యంక! మనోజ్ఞరూపమకరాంక! యుదగ్రభయంకరాజి ని
శ్శంక! హృతాఘపంక! గుణసాగర! శ్రీకర! వేంకటేశ్వరా

శా. కోదండాస్త్రముఖ్యరిపుకోటి మరుత్తతిభక్షణైకగం
భీరభుజంగ! సాధుజనబృంద మనోవననీమ నిత్య సం
చారకురంగ! సత్యకలుషవ్రజభూరితమఃపతంగ! దో
స్సారవిశేషభంగ! సురజాలమనోహర! వేంకటేశ్వరా.

ఉ. శ్రీద! దినేశచంద్ర సురశేఖరముఖ్యసురాళి మానసా
హ్లాద! వసిష్ఠకౌశికసుశాత్రిముఖాఖిల మౌనిజాల స
మ్మోద! రమావినోద! మునిపూజితపాద! మహాఘవల్లికా
చ్ఛేద! శ్రితప్రమోద! నిను జేరి భజించెద వేంకటేశ్వరా.

ఉ. శ్రీధర! హీరశీతకరశేఖర సన్నిభసద్యశోధరా!
గాధిసుతాత్రిముఖ్యమునికాండహృదంతరచారుశాలిధా
రాధర! సజ్జనావనధురంధర! రావణముఖ్యరాక్షస
క్ష్మాధరపాళివజ్రిధర! సాధుజనాదర! వేంకటేశ్వరా.

ఉ. తమ్ములుమీపదమ్ములు;సతమ్ముసుఖమ్మునుగూర్చుపారిజా
తమ్ము మొగమ్ము; ఘోరదురితమ్ముహరించెడిసత్కృపాప్రపూ
తమ్ముమనమ్ము;తమ్మునుముదమ్ముగరమ్మునిరంతరమ్ము స్వాం
తమ్మునజెంది,పేర్మ్ములనుదల్పెదనోప్రభు! వేంకటేశ్వరా.

ఉ. నమ్మమనమ్మునందనుదినమ్ముఘనమ్ముముదమ్ము జెంది, సూ
నమ్ములనీపదమ్ముల ననంతసుఖమ్మునుగూర్చనేర్తు; దా
నమ్ములవమ్ముగాని, విపినమ్మున నిమ్ముదమమ్ముగాని నే
మమ్ములవ సేయ పూన్కి సుగమమ్మునుగాదయ వేంకటేశ్వరా

ఉ. నందనమందుగోపికల నాతతమున్ సుకుమారపాణులన్
జెందినవీణియల్ రసవిశేషము శేషముగాఁగమీటి, యా
నందముగూర్పనావ్రజజనంబును మోదపయోధిఁ దేల్చునా
నందకుమార! నిన్బొగడనాకును సాధ్యమె? వేంకటేశ్వరా.

ఉ. ఎవ్వనిదోఃప్రభాగరిమ యెల్ల జగంబులదీప్తిఁ జెందెనో?
యెవ్వనిసత్కృపామృతమహీనముగా నిలనిండియుండెనో?
యెవ్వనిరౌద్రదృష్టిరిపుబృందము నెల్ల నశింపఁజేయునో?
యవ్విధి నీవుకావె? కరుణాకర! శ్రీకర! వేంకటేశ్వరా.

చ. కలసయినన్ దలంపనిను; కష్టజనుండను; పుణ్యహీనుఁడన్
మలినుఁడనో ముకుంద! యని, మాటలనైన ననునాత్మనైన నేఁ
బలికియెఱుంగ; నట్టినను ద్వత్కరుణామృతవార్ధిఁ దేల్చఁగా
సలిపెదవిట్టినీకొకరు సాటిగలారొకో! వేంకటేశ్వరా.

ఉ. ధ్యానితభూరి సద్గుణవితాన! మహీసురమండలీమనో
ధీన! రమానిధాన! సుమతివ్రజమానసవాంఛితార్థ సం
తాన! శచీసతీశభవధాతముఖాఖిల నిర్జరావళీ
ధ్యాన! సదాశ్రితావనవిధాన! యశోధర! వేంకటేశ్వరా.

ఉ. వందనమానసురప్రముఖ పంకజఖండనగంధ సింధురా!
వందనమాశ్రితప్రకర వందితపాదసరోజ బంధురా!
వందనమింద్రనాగసిత వారిరుహాభయశోధురంధరా!
వందనమిందిరాహృదయ వారిజబంభర! వేంకటేశ్వరా!

ఉ. శ్రీకర! నీకృపామృతము శేషముగా గ్రహియించుమానవా
నీకము భవ్యసంపదల నేకము ధారుణిఁ జెంది, పిమ్మటన్
నీకమనీయసన్నిధిని నిల్చునవశ్యముగాన, గొల్తు నే
నో కమలాక్ష! త్వత్పదపయోజయుగంబును వేంకటేశ్వరా.

ఉ. పాలితసర్వభూమిసురపాళి! నిశాటధరాధరాళి దం
భోళి! రమాసతీహృదయపుష్కరహేళి! కృతాశ్రితాత్మవా
హ్యాళి! విరించిశంకర బలారి ముఖామరపాళిమౌళి! ప్ర
క్షాళితదుర్జనాళి! గుణశాలి! రమావర! వేంకటేశ్వరా.

చ. చారుసురాపగారజిత శైలసితాబ్జసితాంబుజాత డిం
డీరతుషారశీతకర నిర్ఝరనాథ గజేంద్రమల్లికా
హారపటీరహీర శరదంబుధరవ్రజసాంద్రచంద్రికో
దార! యశోవిహార! నిజదాసజనాదర! వేంకటేశ్వరా.

ఉ. అమరశేఖరాంబుజభవాభవముఖ్యసుధాశనాదిక
గ్రామణి! యిందిరాహృదయకంజనభోమణి! స్వాశ్రితాళిర
క్షామణి! సజ్జనావళి శిఖామణి! సర్వము నీశ్వరాళివాం
ఛామణి! చక్రపాణి! సువిశాల ఘృణీమణి! వేంకటేశ్వరా.

ఉ. రాక్షసవంశసంభవుఁడరాతి సహోదరుఁడౌ విభీషణుం
డక్షయకాయసిద్ధిబడయన్ భవదీయ సపర్యకాదె? ప్ర
త్యక్షముగాఁగఁ గారణము? త్వత్కృపఁ గాంచఁగ భక్తి తక్క వే
రీక్షితి నేమిగద్దు? పరమేశ్వర! శ్రీశ్వర! వేంకటేశ్వరా.

ఉ. ఎట్టిశుభక్షణంబున రమేశ! త్వదీయచరిత్రవాకొనన్
బుట్టెనొ వాంఛితంబు మది; మోదమమేయముగాఁ దలంచుచుంటినా
కెట్టివి లేవు లోపములు? హీనకృపాకర! నన్ను నీవు చేఁ
బట్టి, యుదేవిధానఁ బరిపాలన జేయుము వేంకటేశ్వరా.

చ. జలరుహగర్భుఁడున్ శివుఁడు సర్వసుపర్వులు యుష్మదీయస
ద్విలసిదనంతసచ్చరిత్రమును దెల్పఁగజాలరు; వేదరాశినీ
సలలితసత్కథావళులఁ జాటఁగఁజాలదు. నిన్నుఁ బోపు భూ
వలయమునందు నిన్ బొగడఁ బద్యశతంబున వేంకటేశ్వరా.

ఉ. ఓబలసూదనప్రణుత! యో సరసీరుహపత్త్రనేత్ర! హే
జీబుకులోద్భవుండఁ దమసేవకసేవకసేవకుండ; నీ
వే బ[illegible]ధాంభరింపమను వేంకటరాయఁడ; సత్కృపామతిన్
ధీబలసంపదల్ గలుగఁ దీవన లీఁగదె! వేంకటేశ్వరా.

ఉ. మంగళమయ్య భక్తవర! మంగళమయ్య వికుంఠమందిరా!
మంగళమయ్య మోక్షకర! మంగళమయ్యల సద్యశోధరా!
మంగళమయ్య చక్రధర! మంగళమయ్య సురారిసంహరా!
మంగళమయ్య నిత్యము, రమాహృదయేశ్వర! వేంకటేశ్వరా 108

సంపూర్ణము.

శ్రీ కన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.